# మురళి

ఖండకావ్యము - ద్వితీయ భాగము



-: రచయిత :-

బృందావనం రంగాచార్యులు



సాధారణ 1970 ఉగాది

# పరిచయము

కొల్లా సుబ్బారావు M.A.,

నాగులపాలెం

బృందావన నందనోద్యానంలో వికసించిన సాహితీ కుసుమాలలో "మురళి" ద్వితీయభాగము; నేడు రసజ్ఞపాఠకలోకాన్ని మురియించడానికి సిద్ధపడింది.

ప్రథమభాగంలో గోపరాజు, త్యాగరాజువంటి పరమభక్తులను మధురముగ కీర్తించిన రచయిత యిందులో జన్మభూమిని - జాతీయ నాయకులను - కర్షకుని - కమనీయములైన పద్యాలలో హృద్యముగ స్తుతించడము గమనార్హ విషయము.

నిర్మల గంగాప్రవాహమువలె లలితమనోహరమై - అలరారే శైలిలో; పద్యాలన్నీ పసందుగా విందులు చేస్తున్నాయి.

" ఆయుధమూని యుద్ధమునకై పయనించెడి సోదరప్రజా
ధ్యేయము మార్చి-బుద్ధునిదేవుని బాటకు త్రిప్పి-నూతనా
ధ్యాయము వ్రాసినాడవు మహాత్మ! సుదీర్ఘ దురంతదాస్య బా
ధాయుత సన్నివేశమయదారుణజాతి కథానకమ్మునన్. "

బాపూజీని గురించి - రచయిత ఈ విధంగా అనడం యెంతో ఉదాత్తముగ నున్నది.

పాక్ సైనికుల పాలిటికి సింహస్వప్నముగ వ్యవహరించిన ఆంధ్రవీరుడు తాతా పోతరాజును గూర్చి "వీరపూజ"లో రచయిత భావాలు మహోజ్జ్వలాలుగా భాసించాయి.

నిప్పులు గ్రక్కెనా: కనులు నింగిపయిన్ జరియించు శత్రువున్
పిప్పియొనర్పగా ప్రళయభీకరరూపము దాల్చువేళ - యే
ముప్పును లెక్కసేయకయె ముందుకు దూకిన తెల్గుబిడ్డ ః నీ
గుప్పిటిలో తుపాకి బలిగొన్నది శాబరుజెట్టుపిట్టలన్.

కర్షకస్వామిని గూర్చి రచయిత యోచన కడుంగడు రమణీయము.

మేదినిబట్టి యీ తలకుమించిన భారము మోయనంచు నీ
వాడిన - విశ్వశోభ కొఅవై కఱవేర్పడు - లోకబంధువే
కాడిని వీడునాడు త్రిజగమ్ముల నోటికి ముద్దదక్కునా;
నాడును; నేడు; రేపు; యుగనాధుడవీవె నిజమ్ము కర్షకా!

సత్యాన్ని చక్కగా నిర్వచించిన సాహిత్యమిది.

"ఉగాది" ఊహలు రచయితహృదయాన రమ్యంగా మృమ్మరంగా నర్తించాయి.

పండిత పామరులనలరించే - ఇట్టి రసఘుటికలు ఖండ కావ్యమునందంతట కనిపిస్తాయి. నేడు ప్రకటితమగుచున్న నవ్యాంధ్ర కావ్యకుసుమాలలో - గణనీయముగా మా రంగాచార్యులుగారి "మురళి" మన గలదని; సహృదయుల నానందింప జేయగలదని ఆశిస్తాను.

శుభమ్.

నాగులపా

# శుభాకాంక్ష

"తెనుఁగులెంక" "కళాప్రపూర్ణ"

**తుమ్మల సీతారామమూర్తి**

మున్ను 'బృందావనమ్ము'న మొరసినట్టి
మురళితో శ్రీశభక్తి నేర్చిరి జనాళి
నేడు 'బృందావనమ్ము'న నెఱసినట్టి
మురళితో దేశభక్తి నేర్తురు జనాళి.

కలదు భారతజాతిగౌరవాంకమ్ముగా
వాసిగన్నట్టి మువ్వన్నెపడగ
కలదు సేవాత్యాగములను మిన్మిగిలిన
దేశభక్తుల శుభాధీనచరిత
కలదు వచ్చిన యధికారంబు నిస్స్వార్థ
సరణి సాగించిన గఱువతీరు
కలదు దానిసము క్రిక్కఁదల నాంధ్రజగత్తు
వలచి సైచిన సముజ్జ్వల తపమ్ము

కల దహింసారణాచార్యక ప్రసిద్ధ
బాపుజీ భవ్యజీవనపథము _ దీన
మనసునిల్పి పఠింపుడీ మాననీయ
ధర్మ సంసక్తులార ! సోదర్యులార !

నాగులవా

# మోహనమురళి

'కరుణశ్రీ'

అది జగన్మోహనంబైన బృందావనము
అది కళాజీవనంబైన బృందావనము
హృదయమ్ము పొంగి ప్రవహించి కాళిందియై
కదలివచ్చిన నవ్య కావ్య బృందావనము

బృందావనమున మాకందములు కాచినవి
బృందావనమున అరవిందములు పూచినవి
బృందావనమున మ్రోగించెడి మోహనమురళి?
బృందావనమున సాగించె రసమయమురళి

ఎంత తియ్యని మురళి ! ఎంత చక్కని మురళి
అంతరంగముల నుయ్యాలలూచెడి మురళి
"ఆచంద్ర తారార్క" "మాబాల గోపాల"
"మా పేతు కైలాస" మవధరించిన మురళి

కమ్మ కమ్మగపాడే కలకంఠ సంచయము
సమ్మోహనంబైన జగమెల్ల రసమయము
అది జగన్మోహనంబైన బృందావనము
అది కళాజీవనంబైన బృందావనము.

# సుకృతి



సారస్వత నికేతన గౌరవ కార్యదర్శి

**శ్రీ అడుసుమల్లి శ్రీనివాసరావుగారు**

వేటపాలెం

# సంకృతి

పలుకు పలుకున తేనియ లొలుకువాడు
శారదా పూజలన్ కోరి సలుపువాడు
"అడుసుమల్లె"కి నెత్తావు లలదువాడు
అనఘుడై శ్రీనివాసుడై యలరువాడు.

సరసుడు సాహితీప్రియుడు సజ్జను డాదరణార్ద్రభావనన్
మరువనివాడు _ మా "అడుసుమల్లెఘనుండు;" స్వదేశభక్తి త
త్పరు డొసంగినాడు నా కయితివల్ల మహోదయమున్ వెలార్చి యీ
"మురళి"కి అక్షరాకృతిని ముద్దుగ దిద్దగబూనె చేర్మితో.

చిరునవ్వుల్ జిలికించు మోమున వచశ్శ్రీమాధురీ మోహన
స్ఫురణమ్ముల్ వెలుగొంద; సర్వజనతాపూర్ణాభిమానమ్ము నా
దరణమ్మున్ గను శ్రీనివాసబుధు; సౌందర్యస్వచ్ఛసాహిత్య త
త్పరతల్ సంస్తవనీయముల్ లలితభావప్రాభవోపేతముల్.

మానవు నమరుగా మాన్యుగా నొనరించు
విద్యాభివృద్ధియే విమలదీక్ష;
జననియై విజ్ఞాన సారమ్ము బంచెడి
గ్రంథ మందిరమహో ; కర్మభూమి;

శాంత్యహింసా పరిభాజ్వల దుపకార సు
ధా పరిసారమ్మొకటే ప్రవృత్తి;
మంచిని మన్నించి మనసార చెడుగును
చెండాడివేయుటే జీవితమ్ము.

గాగ; మనుగడ గడపెడి గాంధీ భక్తు
డయిన మా శ్రీనివాసరాయని మహోజ్జ్వ
లాశయమ్ములు సఫలత నందుకొనుచు
సాగిపోవలె విరజాజి తీగవోలె.

మంచికి మారుపేరు; కుసుమమ్ముసుమీ: హృదయమ్ము-శక్తి వె
చ్చించును సంఘసేవకె - వచించును సత్యమె - ఎట్టి కీర్తి నా
శించి శ్రమించబోడు - కృషిజేయును ధర్మప్రధాన - ఈ రసో
దంచితపుణ్యభావను నిరంతరదీక్ష జయించుగావుతన్.

—రచయిత

—( ౦ )—

# నమస్సులు

"మురళి" ఖండకావ్యద్వితీయభాగము నేడు సహృదయపాఠక కరకమలములకు సంతోషముగ సమర్పింపబడుచున్నది.

ఇందలిస్వరాలరీలను తొలుత తెలుగువారికి పరిచయము గావించిన —ఆంధ్రప్రభ— ఆంధ్రపత్రిక ఆంధ్రప్రదేశ్ మున్నగు పత్రికాధిపతుల సౌజన్యమునకు సర్వదా కృతజ్ఞుడను.

కోరినంతనే యీ కృతికి అక్షరాకృతి ఘటింప నంగీకరించి; నిరుపమానాభిమానమును బ్రకటించిన సుకృతి— శ్రీ అడుసుమల్లి శ్రీనివాసరావుగారు, వారి సారస్వతసేవాతత్పరత గణనీయము.

పరిచయవాక్యములు వ్రాసి— శుభాకాంక్షల నందించి— మురళిని మోహనమురళిగా సంభావించినపూజ్యులు— విద్యానిధులు; కళాప్రపూర్ణులు లలితమధురకవితాకళాసంపన్నులు, శ్రీ కొల్లాసుబ్బారావు; శ్రీ తుమ్మల సీతారామమూర్తి; శ్రీ బంధ్యాల పాపయ్యశాస్త్రిమహోదయులు. వారి వాత్సల్యము వందనీయము.

నా సారస్వతకృషిని సర్వవిధముల ప్రోత్సహించుచున్న మాపాఠశాలాధికారుల యనురాగభావన సంస్తవనీయము. మురళిని ముద్దుగ ముద్రించియిచ్చిన మాతృశ్రీ ముద్రణాలయాధికారుల కృషి ప్రశంసనీయము.

ఈ శుభసమయమున వీరికెల్లరకు నమస్సుమముల నర్పించుచున్నాను.

—రచయిత.

# స్వరాలు

# జననీ జన్మభూమిశ్చ.......

సిరిని లేమిని లెక్కసేయని ధీరులు
సాధు భావన గల సత్యధనులు;
పసిడిగుప్పిళ్ళతో పంచినదాతలు
పావనోదార స్వభావరతులు;
పరులహితమ్మె సంభావించు సుజనులు
లోకకల్యాణ విలోలమతులు;
అత్యపూర్వ తపోమహత్వ సంపూర్ణులు
జాలిగుండెలుగల సచ్చరితులు;

పాలితుల కన్నబిడ్డల పగిదినెంచి
యేలుకొనజాలినట్టి నృపాలవరులు;
తనయులై కొల్వ కీర్తికేతనము రెత్తి
వైభవోపేతయాయె మా భరతమాత.

మురళి

వేదసుధారసాస్వాదనతో నవ
చైతన్యరమ మానసమున నిల్వ
గైర్వాణీ ఘనపద కంజ పుంజమ్ముల
సంసేవనమ్ముచే శక్తి పెరుగ
సకల శాస్త్రజ్ఞానసంపత్తి తులలేని
ధీబలప్రభలను దిద్దుచుండ
కావ్యపురాణశాఖల మేలినీడలు
హాయిని స్థాయిని అందజేయ

శిల్పనైపుణ్యములు క్రొత్తజీవ మొలుక
శాంతిచంద్రిక లెల్లెడ జాలువాఱ
మధురభావప్రభావపరంపరలు విరియ
ప్రథిత యశమును గాంచె మా భారతమ్ము.

ఘంటమ్ము సుధలకే కాణాచిగాగ కై
తల నల్లినారు బుధప్రవరులు
ధర్మ వీరమున కౌదార్యమ్ము పురివోయ
వెన్నుజూపక పోరె వీరకోటి
సకలశాస్త్రజ్ఞానసంపత్తి నొసగి: యు
త్సుకత ఘటించె దేశికగణమ్ము
అనురాగకల్పవృక్షిగాశ్రిన నిల్చి యో
ర్పును నేర్పినారు కారుణ్యనిధులు

మురళి

దారుణమ్మయిన యుద్ధము ధర్మవీరు నా
లోచనకల్పమై తోచె నిచట
తీరని కోరికల్ సారహీనములై వ
దాన్యతకడ తలవంచె నిచట
ఐహికసుఖము త్యాగాగ్నికిం గరగి ప
సిండికాంతుల విరజిమ్మె నిచట
సర్వశక్తులు సతీ సౌశీల్యబలము చెం
గట తృణమ్ముల స్థితిగాంచె నిచట

ఆర్షసంస్కృతి ఖండఖండాంతరముల
కనుపమాదర్శ పథకము లందజేయ
అణువణువున మహాత్వమే యతిశయింప
నిరుపమమ్ముగ వెలిగె మా భరతమాత.

---

# జనవరిరువదియారు !

"లజపతి" సేవావిలాస మహోన్నతి
"చిత్తరంజనుని" విశిష్ట దృష్టి
"బాలగంగాధర" ప్రవిమలాశయ దీప్తి
"నౌరోజి" ధీప్రమాణ ప్రశస్తి
"గోఖలే" వైదుషి రేఖా ప్రకాశమ్ము
"మోతిలాల్" తరుణ తపోగుణమ్ము
"బాపుజీ" త్యాగ సంపన్న శాంతివ్రత
"మాజాము" "నెహ్రూ" సమైక్యపరత

"వల్లభాయి" అకుంఠిత వాగ్విభవము
"బాబురాజేంద్ర" నిర్మల భద్రదీక్ష
"శ్రీమతి సరోజినీ" కవితామహత్తు
జనవరిరువదియారుగ జననమందె.

మురళి

పలనాటి "హనుమంతు" ప్రజ్ఞా విశేషమ్ము
"అల్లూరి రామన్న" అగ్రహమ్ము;
"దేశభక్తు"ని మహావేశ పవిత్రత
"పట్టాభి" మేధాప్రభావిపులత;
"ఆంధ్రకేసరి" ప్రచండాదర్శవిస్ఫూర్తి
"సాంబమూర్తి" విశాల శస్తకీర్తి;
"ఆచార్య" శేముషీ రోచుల విభవమ్ము
"గరిమెళ్ళ" యుజ్జ్వల కావ్యధార;

"ఆంధ్రరత్న" నవాశయావ్యయబలమ్ము
"ఉన్నవ" మహోగ్ర సంస్కరణోద్యమమ్ము
"విశ్వదాత" మహోదార విజయలీల
"జనవరిరువదియారు"గ జననమందె.

ఒక మహాధర్మనిష్ఠకు గట్టుపడి మమ
కారమ్ముల జయింపగల్గినారు
ఒక మహాలక్ష్యమే యుద్దిష్టఫలముగ
నిరుపమ దీక్షతో నిలిచినారు
ఒక మహాశయ భావనికరబలమ్మున
నడుగు వెన్కకు వేయకరగినారు
ఒక మహావేశ ముద్ఘాతలూపగ భార
తమున స్వేచ్ఛఘటింప దలచినారు

ఒక మహాస్వర్ణసంకల్ప మూర్తి నెల్ల
ప్రకృతి మొనరింప శాంత్యహింసావ్రతాన
జనపరివృఢియాయె సాక్షాత్కరింప
నేఁడైనాఁడు మనపాల వెల్లివాఱి.

పలుకు పలుకున స్వేచ్ఛాపిపాస యుబుక
నిత్య నియమవ్రతమ్ముగా సత్య సాధన
పథమున నడిపి లక్ష్యమున్ బడసినట్టి
ఘనుల కిలకిల పలుమ్ము నిక్కమ్ము "నేఁడు".

# పసిడిపంట

నరనరమ్మున స్వాతంత్ర్య తరుణ రుధిర
ధారలురలగ; జాతీయతయె రహింప
విఱుచుకొనిపడి దొరలపై విజయమందె
భారతీయుడు నేడహింసారణాన.

తమ సర్వస్వమునొడ్డి — దేశజననీ దాస్యమ్ముబోకార్ప — ది
గ్భ్రమగల్గించుచు శాంతిసంగర ముఖద్వారమ్ములోనిల్చి — వి
శ్వమె "యోహో" యని యూగిపోవగ ప్రశంసల్ జూఱగొన్నార లు
ద్యమనేతల్ మన భారతీసుతు లుదాత్తప్రజ్ఞ నెగ్గించుచున్.

కనకపుగడ్డలే కరగి కాలువలై ప్రవహించె స్వేచ్ఛకై
పెనగెడివేళ — స్త్రీపురుషభేదములేక పరప్రభుత్వ పీ
డన విదళింప దీక్షగ గడంగె ప్రజావళి — శాంతిముందు శా
సనములు మోకరిల్లినవి — సత్యమహింసయు గెల్చె దౌష్ట్యమున్.

దొంరల దౌర్జన్యపైభరి – యూర్ధ్వదృష్టి
పాశవికభావకేలి – దుర్భర దురంతి
పాలనారీతి – యుండ స్వభావపసరి
శాంతపడి తలపించె నందమ్ము నేడు.

పగలపొగల్ సెగల్ నిఖిలభారతమందు జ్వలించుచుండగా
పగపగరోషవహ్ని, గుణరాశిని స్వి మనోబలప్రభన్
దగిలిగగాత సూక్తి రసభాసంలనొ చెటన్ – క్షమాగుణ
ప్రగతికి లొంగె రాక్షసపిపాసపుయుక్తము నేడు ధ్వస్తమై.

పసికందుల్ ముసలయ్యలున్ గదలి శుంభద్వైశ్యసంపూర్ణులై
నసిజాపింప నెడిల్చు నిప్పురిటి – పాశ్చాత్యప్రభుత్వాధికా
రసముద్రమ్మున కడుకట్టబడగా లక్ష్యమ్ము సిద్ధించి కై
వసమైపోయెను నేడు భారతమునన్ స్వాతంత్ర్యసౌభాగ్యముల్.

తీయనిశాంతివాణి నినదించె స్వతంత్రమరీచిమాలికల్
హోయగము ల్వెలార్ప – సుమసుందరిమాడ్కి త్రివర్ణకేతన
శ్రీ యిట నాట్యమాడె – ఫలసిద్ధికిపోరిన వీరకోటికిన్
హాయిలభించె – భారతమహత్తర సత్కృషిపండె నేడహో!

మురళి

తరములనుండి పాశవికతత్త్వము గజ్జెలుగట్టియాడె నీ
ధరపయి నాంగ్లపాలకపతాకలనీడన - సత్యశాంతిసం
గరమున స్వేచ్ఛనందుకొనగల్గినజాతి; స్వధర్మసంస్కృతీ
చరితకు "నేడు" మేల్పసిడిచాయలు దిద్దెను త్యాగశక్తితో.

సతులు సుతులను మమకారమతము వదలి
సర్వము స్వరాజ్యసమరము సాగుకొరకు
ధారవోసిన పుణ్యుల ధన్యచరిత
విజయగీతులతో మేళవింపుదోయి!

---

# ధ్రువతార

సత్యాహింసలను సమారాధించి-జాతికి నీతిని: నిస్తులరీతిని; నేర్పి-శాంతిని కాంతిని ప్రసాదించి-స్థాయిని హాయిని సంఘటించిన పూర్ణ పురుషుడు, భారతభాగ్యవిధాత గాంధీజి.

విశ్వ ప్రేమికుడైన యీ పుణ్యమూర్తి మానవాళి హృదయగగనసీమలో శాశ్వత గౌరవరోచులతో సదా విలసిల్లు ధ్రువతార.

ఆ మహాత్ముని శతజయంత్యుత్సవములు - భారతికి నిత్యోత్సవములు

క్రౌర్యము నుక్కడంచి-మమకారముల న్వెలయించి-విజ్ఞతా
శౌర్యము బెంచి-సాధుగుణసంపదల న్జగమెల్లనించి-ఆ
శ్చర్యకరోజ్జ్వలప్రబలశక్తిని జాతికి బంచినట్టి-ఆ
చార్యవతంసమా! విమలసంయమిచంద్రమ! బాపుజీ! నమో.

౧౯౬౯

## మురళి

వెన్నవలెన్ శిరీషసుమపేశలతావిభవమ్ము పోల్కి సం
పన్నము తావకీన మృదుభావము దేశహితైకపూర్ణ స
త్యున్నత మార్యసన్నుతమహో! పరతంత్రసుదీర్ఘ పాశవి
చ్ఛిన్నచణమ్ము హాస్యము ఋషిప్రవరప్రథితమ్ము బాపుజీ!

కనుగొనలజ్వలించెడి యుగమ్ములనాటి తపోబలమ్ముతో
జననిపదాంబుజమ్ము లనిశమ్ము మనమ్మున నిల్పి స్వేచ్ఛకై
పెనగిన నీ కృషిప్రతిభకున్ కృతజ్ఞ నివాళుల బట్టె కాంతిరే
ఖనములనీడలో నిను తథాగతుగా మది సంస్మరించుచున్.

రాగము సర్వమానవపరమ్ముగ రంజిల శాంతి సత్య సం
యోగమునన్ ధరాతల మహోన్నతి మిన్నునకంటు సర్వసా
భోగవిసర్జనమ్మున నపూర్వఫలమ్ములు జన్మభూమికై
త్యాగమొనర్చి గెల్చిన వదాన్యుడ! భారతభాగ్యభానుడా!.

ఆయుధమూని యుద్ధమునకై పయనించెడి సోదరప్రజా
ధ్యేయము మార్చి బుద్ధమునిదేవుని బాటకు ద్రిప్పి నూతనా
ధ్యాయము వ్రాసినాడవు మహాత్మ! సుదీర్ఘ దురంతదాస్యబా
ధాయుతవల్లిపేశమయదారుణజాతికథానకమ్మునన్.



సుమనోమలమ్ము పుష్పశోభితము — నీ
మానసమ్ము ప్రసన్నమందిరమ్ము
కారుణ్యపూర్ణగంగాప్రవాహమ్ము — నీ
సంభావనమ్ము — నిశ్చల సదమ్ము
దివ్యతీర్థసమమ్ము — దేవాలయమ్ము — నీ
ప్రార్థనాసమయమ్ము — పావనమ్ము
శాంత్యహింసాబల సంపన్నమ్ము నీ
సాహసంకల్పమ్ము — సన్నుతమ్ము

విశ్వవిభవాకరమ్ము — పవిత్రలక్ష్మ
సాధనాభాసురమ్ము — సత్సాంప్రదాయ
సంస్కృతీ మంజులమ్ము — చరిత్ర స్ఫురణ
చిత్రము — హిమాలయమ్ము — నీ జీవితమ్ము.

వణకెన్ ద్రావక శాంతిసంగరమహావహ్నిచ్ఛటాస్ఫూర్తిచే
ఘనపాశ్చాత్యబలీయముష్కరత మోగర్వాంధరాజ్యాంగమె
ల్ల — నవాశాపరిపుల్లభారతజనాలాపమ్ముగా నీవు వ
ల్కినపల్కుల్ వినదించె విశ్వజనయిత్రీవేణువున్ గుల్కుచున్.

పరతంత్రప్రభ మాసిపోయినదహో బ్రహ్మాండమౌ తావకో
ద్ధుర దీక్షామయభావభంగిమలకాంతుల్ పొంగి పొర్లంగ-సుం
దర సుశ్రావ్యసుగీతికాతతులు స్వాతంత్ర్యప్రభావమ్ము న
బ్బురమున్గొల్పువిధానబల్కి-నవి-నీపుణ్యమ్మునన్ పూజ్యుడా !

నీ చిరునవ్వులో పూచినవెల్గు లో
కాలలో దుఃఖ శోకాలమాపె;
నీమాట వేదమై-యీ మేదిని న్మహా
పదగూల్చు భావసంపద వెలార్చె;
నీ సేత; స్వేచ్ఛకు దోసిలినొగ్గి-త
రాలకోరికల వరాలనందె;
నీ పుట్టువే భారతీ పుణ్యమౌచు-దా
స్యాలజీల్చెడి రహస్యాల దెలిపె;

నీ మహోద్యమ విభవమే సీమదొరల
పరువుగరగించె- మాతకు బరువు దించె
నీవు నిజముగ లోకైక నేతవమట
కింతకంటెను సాక్ష్య మింకేమి వలయు?,

# జోహారం

జెండా జాతికి జీవగఱ్ఱ. స్వాతంత్ర్యాన్ని అభిలషించిన భరత జాతి- తన భావాలకు దర్పణముగా ఒక కేతనాన్ని గూడ సృజించుకోవాలని సంభావించింది.

ఆ కాంక్షకు మధురాకృతిని దిద్ది జాతీయ పతాకాన్ని నిర్మాణ మొనర్చిన ఘనత ఒక ఆంధ్రమహాపురుషునకు దక్కింది.

మహాత్ముని ఆశీస్సులతో సూచనలతో విజయవాడలో కొన్ని గంటల కాలపరిమితిలోనే మన జాతి భావములకు ప్రతిబింబముగా చక్కని పతాక నమూనా తయారు చేసి యిచ్చినవారు స్వర్గీయ పింగళి వెంకయ్యగారు.

వారికి జోహారులర్పించుట జాతికి విధ్యుక్త ధర్మము.

జాతియశమ్ము నల్గడల జాటగజాలిన దివ్యచిహ్నమౌ
కేతనమున్ సృజించి చిరకీర్తిగడించిన దేశభక్తుడా !
నీ తొలిజన్మపుణ్యము గణింపగనేటికి ? నేడు విశ్వవి
ఖ్యాతిగొన్న నీ కృషి అనంతతపఃఫలమన్నతెల్లదా !

ము గ ళి

శాంతిశాంతివిహారుల స్వభావము లార్జవసత్ప్రభావముల్
తిరిచిదిద్ది నేర్పినకృతీ! సుకృతమ్మున నీ భవమ్ము మం
దారముగాగ మారినది ధన్యతనందిన దీ స్వతంత్రయో
భారతిపాదయుగ్మములపై నవరోచుల జిల్కరించుచున్.

నీ కృషి బాపుజీహృదయనీరజమున్ గదలించి హైందవ
శ్రీకి చిరంతనమ్మగు విశిష్టతగూర్చెను-భారతప్రజా
నీకము నిల్పి గెల్చినది నిక్కము నీదు పతాకసీడలో
కాంతులుదీరు విశ్వహితకాంక్షను జాతికి బంచిపెట్టుచున్.

సులలితభావనావిభవశోభల గుల్కెడి కేతనమ్ము సూ
హాలవెలయించి యీయుగలయట్టి మహాత్ముడు తెల్గుగడ్డపై
నిలుచుటదోసమా! యని మనీషియొకానొక రన్నిమాటయాం
ధ్రుల గరగించె నిర్మమతతో తరియించిన ధన్యజీవుడా!

భావక ధీబలమ్మునకు తాత్త్వికశక్తికి దేశభక్తికిన్
సేవలుదేలు విశ్వహితచింతకు బ్రహ్మరథంబుబట్టినన్
[illegible] [illegible]లన్ వలిపి పొంగిన విత్యము సంస్కరించినన్
[illegible]! [illegible] బాయగజాలునె? జాతి యెన్నడేన్.

తుష్టిని లేమిలో మమతతో దిలకించెడి భాగ్యశాలివై
స్పష్టమొనర్చినాడవు ప్రశ స్త సమ స్త శుభాశయమ్ములన్
దృష్టికిదెచ్చి— భవ్యభవదీయతపమ్ముఫలించె గేతన
స్రష్ట! జొహారు యుష్మ దజరామరశాశ్వతకీ ర్తిమూ ర్తికిన్.

అంగార తుల్యమగురా
జ్యాంగమ్మున స్వేచ్ఛగోరి— అహరహము వ్యధన్
గ్రుంగెడి దేశీయులపై
పింగళి వెంకయ్య! నీవు పిండితివి సుధన్.

# ఆంధ్రరత్నము

స్తుతియింపదగిన స్వేచ్ఛా
వ్రత మవలంబించి - రామభక్తిన్. దాస్యో
ద్ధతి నణచ సాహసించిన
మతిమంతుడః "ఆంధ్రరత్న!" మహనీయః నమో.

వాచవులూరుపల్కు - రసవంతములైన మనోజ్ఞభావనల్ -
సూనికలాయె నుజ్జ్వల విశుద్ధ భవత్ప్రతిభా ప్రశస్తికిన్ -
చూచినవారు రూపగుణశోభకు ముగ్ధులుగాగ నా డహో!
నీ చలువ న్మహాంధ్ర గణనీయయశమ్ము రహించె నగ్రజాః

విలయమ్ము ల్వెలయించి భారతమునన్, స్వేచ్ఛావిహారమ్ము ది
క్కుల నాట్యమ్ము వరింప, గుల్కి నఖలుల్ గోపాలకృష్ణాఖ్యని
శ్చలగంభీరపయోదగర్జనల తాశాసౌధముల్ గూలి గుం
డెలు జారన్, విలపించిరంట - ఇపుడే అట్టిధీరుం డిలన్.

పాలింపన్‌గల నేర్పరుల్‌గలరులే ప్రజ్ఞానిధుల్ ప్రాజ్ఞులున్
మాలో జూడుకటంచు పల్కితి వహో! మాన్యుండ! చీరాలపే
రాలన్ నీ నవకార్యరంగములుగా రాష్ట్రమ్ము మార్మ్రోగఁగా
నాలాపమ్ములు సర్వమానవుల కాహ్లాదమ్ము సంధింపగన్

అచ్చపు రామనామమధురామృతపానము రామచంద్రుతో
పొచ్చెములేని నెచ్చెలిమి, భూరిదయాగుణ, మార్షధర్మమున్
మెచ్చెడి తత్త్వవైభవము మిమ్ము నిజమ్ముగ తెల్గునాడులో
హెచ్చినవానిగా సల్పె నాయకరత్నమ! వేయియేటికిన్.

మేరన్ మీరిన యాశలం దవిలి; దుర్మేధన్ సమస్తప్రజా
పారావారముపైన పెత్తనము సల్పంబూను పాశ్చాత్యదు
ర్వారోన్మత్తకరాళవైఖరుల సంరంభమ్ము బోకార్పగా
ధీరోదాత్తత నిల్చి పోరిన మహాతేజస్వి! కేల్మోడ్చెదన్.

చలనములేనిసాహసము; జాతికి సేవయొనర్చుదీక్ష, ని
స్తులమగుదేశభక్తి, నవదుందుభితుల్యగళధ్వనుల్, మహో
జ్జ్వలయతిరూపవైభవము, శాశ్వతగౌరవ ముద్రిలద్ది, ని
ష్కలుషయశోవిశేషగుణసంపద" గోష్ఠికి వన్నెగూర్పగన్.

మురళి

మతి కింపుఁ ఘటియింపజాలు కవితామాధుర్యసంపత్తి సం
స్తుతులన్గాంచినదేశభక్తి వినుతాస్తోకప్రసంగప్రభా
తతియు న్మూర్తిని గొన్నచందమున నౌద్ధత్యమ్ముతో దుగ్గిరా
ల తపస్వీ! శ్రమియించినాడవు స్వతంత్రస్వప్నముల్ పండగన్.

నీ వాక్యమ్మొకశాసనమ్ముగ మహానేతృత్వభావమ్ముతో
సేవింపం దలపెట్టి రెల్లరు నహో ; చీరాల పేరాలలం
దీ విశ్వోద్యమ మంకురించి హృదయాభీష్టములఁ దీర్పగా
యావద్భారతము న్గదల్చెను సుధీ ! ఆంధ్రప్రజాసారధీ !.

నీ మహోజ్జ్వలసేవలు నిక్కువముగ
కలిమిబలిమినిగూర్చి యీ తెలుగునేల
వెలుగు లీనెడి భాగ్యమ్ము వెలయజేసె
సిద్ధమతి! పూజ్యమూర్తి ! జేజేలునీకు.

# బాబు రాజేంద్రప్రసాద్

పండిన నీ మహానుభవ పంక్తుల నీడన భారత ప్రజల్
దండి మనోబలమ్ముగని దక్షతతో జరియించి స్వేచ్ఛగా
నుండిరి – భాగ్య డోలికల నూగగ సాగిరి–తావకీనమౌ
అండ–నిఃమ్ము భారతజనావళి పాలిటి కొండ; పూజ్యుడా!

సత్య పరోపకారగుణజాల సమన్విత శాంతభావనల్
నిత్యముగా ఫలించినవి నీ మహనీయ చరిత్రమందు–స
త్కృత్యము లాచరించుకొరకే: శ్రమియించితివీవు–భారతా
న్నత్యమ్ము నీబలమ్ము కతనన్ రహియించె నిరంతరమ్ముగన్.

పరుల కష్టాలువిని గుండె కరగిపోవ
చిత్తమున స్వీయ సంక్షేమ చింతమాని
సాహసముజూపి సేవలుసలిపినావు.
నీ దయాదృష్టి అభినందనీయ మయ్యా!

## మురళి

మాననీయ భవ్య మానవేంద్రుండవై
జన్మభూమి సేవ సలిపినావు.
అనుపమాన భారతాధ్యక్షపీఠిపై
నిలిచినావు—యశము గెలిచినావు.

దిగ్దిగంతాల నిరుపమ ధీబలాన
భారతయశమ్ము వెలయింప పాటుబడిన
నీ కరమ్ముల చల్లగ సాకబడియె
ప్రాజ్యమై భవలీల—స్వరాజ్యబాల.

సర్వ విధముల బాపుజీ సత్యపథము
ననుగమించిన యట్టి మహర్షి వీవు—
సకల మానవ విపుల ప్రశంసలంద
నేర్చిన ప్రసన్న భారత నేతవీవు—

సర్వోదయ కార్యక్రమ
నిర్వాహణాశయము మదిని నిల్పినబాబూ!.
పర్వమ్ముగ జీవిత
సర్వమ్ము ఫలించెనయ్యా! స్తవనీయమ్మై.

—శ్రీ శ్రీ

# సుమాంజలి

సంపదలు పండి పొరలిన సాధువింట
మొగ్గదొడగిన సంపెంగ ముద్దుతీగె
సాగివచ్చి సబర్మతీ సాధువుకడ
పరవశించె– జగమ్మున; పరిమళించె.

పులకించెన్ సువిశాల విశ్వహిత సంఫుల్లాశయశ్రీ మహో
జ్జ్వలకారుణ్యరసావతార ! స్థిరదీక్షంగొన్న నీ భావనా
బలమున్గాంచి సమస్తధారుణి నవాశ్వాసమ్ము త్వత్పాలనా
ఫలమై దక్కెను మీ చరిత్రకు–నమోవాకమ్ము విద్వన్మణీ !

# మురళి

కురియించె నీ చూపు కువలయహర్ష సం
ధాయకమ్ముగ ప్రేమ తత్త్వ వృష్టి;
పలికించె నీ వాణి బ్రహ్మాండభాండమ్ము
మారుమ్రోగగ శాంతిమంత్రవితతి;
మురియించె నీ స్నిగ్ధ ముగ్ధ ప్రసంగమ్ము
లైక్యరాజ్యసమితి అభినుతింప;
వెలయించె నీ కృషి విశ్వమంగళ పంచ
వర్ష ప్రణాళికా ప్రథిత ఫలము;

జనని పాదాలమ్రోల నీ మనుగడయను
తేగులాబిరచించె లాలిత్యములను
జరుపుకొనవయ్యా! మరి యెన్నొ జన్మదిన మ
హోత్సవమ్ములు భువికభీష్టోత్సవములు.

నిరుపమ ధీ బలప్రభలు నిత్యవినూత్నములై ప్రపంచ సు
స్థిరతర సౌఖ్యశాంతులకు జీవమువోయ పవిత్రధార్మికా
చరణ పరాయణుండవయి జాతిహితమ్మునకై శ్రమించు "బ
హ్వారు" విబుధాగ్రణీ! నుతమహాద్భుత భావశిరోమణీ! నమో!

వెలయించెన్ భవదీయసాహసిక సద్వృత్తమ్ము సత్యక్షమా
బల సంపర్కమై విశాలనవవిశ్వమ్మందు సౌహార్ద మం
జుల మాధ్వీరసపూర్ణ శోభల; మహర్షుల్ త్వత్త్వ పీయూషధా
రల నాస్వాదించిన గష్టకుల్యను కృపారాశీ! భవత్ప్రేక్షకున్.

ముచ్చట గూర్చె నీ భువన మోహన శాంతివిధాన సాధనన్
గ్రుచ్చిన మాలకై రిపులకున్ వలపుల్గలిగింపజాలుచున్
విచ్చిన తేగులాబి అరవిందములట్ల జనాళిసూపె నీ
సచ్చరితమ్ము లుజ్జ్వలరసస్రవణమ్ములు నూర్జితమ్ములై.

సిరులు పొంగిన యింట విచ్చిన సుమమ్ము
గాంధి బోధనలనెడి సుగంధములను
జిలుకుచుండె స్వతంత్ర లక్ష్మి పదాబ్జ
పంక్తిపై నిత్య నూతనత్వము రహింప.

సువినయశోభ—వేదగణసూత్రపరంపర—సర్వమానవ
ప్రవిమల భావిభాగ్యవిభవమ్ములు తావక దివ్య దీక్షలో
నవనవమైన లక్ష్యములు—నందనమై భరితోర్వి వెల్గగా
నవన మొనర్పబూనితివి—జవ్హారుబాబు! జయోస్తు సర్వదా!

మురళి

పసిడిగుట్టలుత్రవ్వి భారతీయ దరిద్రి
నారాయణుల బోచినావు నాడు
మట్టిలో రతనాలు మణులను బుట్టించి
సాకనుంటివి పేదసాద నేడు
చిరదాస్య పాశాల ఛేదింప కృష్ణ జ
న్మస్థానమున మ్రగ్గినావు నాడు
జాతి శాశ్వత సుఖసంతతులందూగ
నాయకత్వము బూనినావు నేడు

శాంత్యహింసాజపమ్ముతో జయపతాక
నవరుచుల నీనగాజేసినావు నాడు
పంచవర్ష ప్రణాళికా ప్రథితవిజయ
కేతనమ్మెత్తినావు చేజేత నేడు.

నీ వైదుష్యపునీత సత్యసహనోన్మేష ప్రసూనాల నె
త్తావుల్ కేవలమాసియా ప్రజల భద్రప్రాప్తి లక్షించియే
ఆవిర్భావమునందవీవిపుల విశ్వాంతర్జన శ్రేయమే
భావింపంబడు-కోట్ల గొంతులు భవత్ప్రాశ స్త్యమగ్గింపగన్.

# అమర భారతి

మహాకవి - కాశీకృష్ణాచార్యులుగారికి - బూర్గుల రామకృష్ణరావుగారి యధ్యక్షతన సంస్కృత సామ్రాజ్యపట్టాభిషేకం జేసి- స్వర్ణకిరీటాన్ని సమర్పించిన సందర్భాన...

కృష్ణాపావనవాహినీబలసమాకీర్ణమ్ము మీ వైదుషీ
నిష్ణాతృత్వము-రుచ్యమై-విమలమై-నిత్యమ్ము జాల్వారుచున్
దృష్ణన్ దీరిచె నెల్లవారికి ధరిత్రిన్; వందనీయమ్ముగా-
కృష్ణాచార్య శిరోమణీ! గుణఖనీ! గీర్వాణ భాషాధునీ!

అమరవాణీకృపామహితావలోక
నమ్ము గెల్చిన మీకితరమ్ము లేల?
అందుకొన్నారు భారతాధ్యక్షపీఠ
సన్నుతులు మీరు; లన్యప్రశంసలేల?

ఆ జీవితము పూజలందుకొనెన్ సుఖ
దుఃఖాలదేలి; లోతులను జూపి
ఆ వర్తనమ్ము మహాదర్శమున్ బోధ
జేసెను వేదవీచికలనూగి
ఆ చూపు మధురభావాంశల జిలికె-కా
వ్యార్థసారము మనసారగ్రోలి
ఆ చూపు ప్రణవంపుటాకృతిన్ వెలయించె
తత్త్వసుధాశుచిత్వమున మురిసి

ఆప్రసన్నమహర్షికా యఖిల విబుధ
మండనునకు మహోద్దండపండితునకు
రాగమొలికించిపట్టె నీరాజనమ్ము
భక్తిభరితమ్ముగా సర్వభారతమ్ము.

ఎన్నియుగాలకున్ ఋణమునీగగనేర్తురె ఆంధ్రులీవిధిన్
సన్నుతులెన్నిసల్పినను-సత్కృతులెన్నియొనర్చినన్-అవి
చ్ఛిన్నమనోజ్ఞ వాఙ్మయ విశిష్టపటుత్వమహత్వకీర్తిసం
పన్నమతీ! నిజమ్మమరభారతి! ఆంధ్రబృహస్పతీ! నమో!

---

# గీతాంజలి

ఖడ్గఖేలనముల కహంకారములకు
పాశవికచేష్టలకు; భయపడక—భరత
భాగ్యదీప్తిని నలుదెసల్ పరిఢవిల్ల
జేసిన మహామనీషి ! జేజేలునీకు.

పిరికికండలుచెండి సోదరుల దండి
మగలగాపింపగలిగె నీమహితబోధ—
శాంత్యహింసలకే గురుస్థానమొసగి
విక్రమించి రహించె నీవీరగాథ.

దారుణమ్మగు జాతీయదాస్యపాశ
వితతి తెగిపడె నీ మహోన్నతపు కృషికి—
భారతమ్మున స్వాతంత్ర్యతోరణములు
రుచులనీనె భవత్తపోవిచయమునకు.

మురళి

మిత్తినెదిరించి జాతివిపత్తిద్రుంచి
దయలు పండించి మానవత్వమునుపెంచి—
రక్కసితనమ్ముడంచి ధర్మమువచించి
స్వేచ్ఛవెలయించి పరుల నిర్జించితీవు.

తరుణదరహాసశోభలో కరుణచింద
విశ్వకళ్యాణకాంక్షయే వెల్లివిరియ
జాతిపిత ! నీవు నలిపిన జైత్రయాత్ర
స్వర్ణఘట్టమ్ము సంగరశాస్త్రమందు.

దీనమానవసేవకై పూని—సమత
నుర్వినెలకొల్పదలచి—మహోద్యమమ్ము
నడిపినమహానుభావ ! నీ విడినభిక్ష
ఈ మహీతలమునకె శ్రీరామరక్ష.

సత్యశోభతో—నైతికసంపదతో—మ
హాబలాగ్ర! [illegible] సదాశయమున
[illegible] యాచరణతో
[illegible] భజమ్ము నీ జీవనమ్ము.

# మిత్రవాణి

స్నేహాన్నిగోరి చేయిజాచిన భరతభూమి మీద బాంబులు వర్షించారు చైనీయులు.

తరాలనుండి సరిహద్దుగా నున్న మెక్‌మోహన్‌రేఖను చెరిపి దురాక్రమణకు పరాక్రమించాడు చైనా అధినేత.

గౌరీశంకరశిఖరాన్ని కబళించాలనుకొన్నవారికిది భారతీయులు వినిపించిన "మిత్రవాణి"

కండలుక్రొవ్వి- నా జనని కాయము గాయ మొనర్చబూని- పా
షండుడ! శాంతిసీమల పిశాచులు తాండవమాడునట్లుగా
ఖండనమున్ రగిల్చితివి-భారతపౌరుషవహ్ని ముందు నీ
దండుగమారి వైఖరికి తప్పవురా! తలవంపులెప్పుడున్.

కచ్చెవహించి మా భరతఖండమునందెలగిని చిచ్చుతో
పచ్చిలడాయికిన్ దిగి–అభాగ్యుడ! చిత్తయిపోదువోయి! నీ
యిచ్ఛ ఫలించునంచు మదినెంచితివేమొ! గ్రహించి మెల్లగా
వచ్చినదారినేగుము వివాదములేటికి మిత్రకోటికిన్?

ఒక్కటి మీరుమేమనెడి యూహలతేనెలుజాలువార మ
త్తెక్కిచరించు నీ విసపుదృష్టినిదాచి నటించినాడవా!
అక్కట! పుణ్యభారతదురాక్రమణమ్మున నేటి కాజిలో
నిక్కపు రాక్షసప్రకృతినీడన; నీస్థితి తెల్లమాయెరా!

జవసత్త్వముల పసజారిన ముదుసలి
సింగములరించి చెంగలించె;
గజ
ప్రథితయౌవనబలప్రాభవమ్మున నూగు
కోడెత్రాచులు బుసగొట్టదొడగె;
సాహసమ్మున రణచండికలై ఆడ
పులులు గాండ్రించిబొబ్బలను బెట్టె;
వెలలేని విప్లవరవ్వలు వీరజాతికి
శౌర్యమ్ము లాగ్రహస్ఫూర్తినెరపె;

భువనభాండాన కలతలపొగలు గ్రమ్మ
స్నేహమర్యాదదాటింప జేతగాని
సభ్యతాహీనులకు తగుశాస్తి సలుప
భరతపౌరుషలక్ష్మి వైభవము మెరసె.

ఉపకృతియొక్కటే యెరిగియున్న ధరిత్రి సమైక్యతా
లపనముచక్క భిన్నమగులాలసలేని మనఃప్రవృత్తితో
సుపరిచితమ్ము పూర్వమె వసుంధరకంతకు పుణ్యభూమికే
అపకృతి నల్పనెంచిన దురాగతమూరక జారిపోదురా !

ధనము ధాన్యము నగలు సంతానతతి
భరతరక్షణనిధికి అర్పణమొనర్ప
విజయశోభావిశేషమ్ము విరియజేయ
సాగుచున్నదిరా ! మా ప్రజాస్రవంతి.

తనువు ధనమ్ము దర్పము వృథావ్యయమైనయటన్న విజ్ఞతా
జనులు సహింప గల్గుదురె ! జాతికి ఖ్యాతి ఘటించువర్తన
మ్మును సమలీల వెల్గిడగదా ! చిరకీర్తి గడింపనేర్పుటే
పునీత ధర్మసూక్ష్మపరిశోధనవల్లనె రీతి భారతా !



అలలై పొర్లెడియూహలన్నిటికినాహ్వానమ్ములందించి సం
కుల సంఘర్షణగల్గజేసితివహో ! ఘోరమ్ముగా మైత్రికిన్
దలవంపుల్ ఘటియింప బూనితివి బౌద్ధప్రాభవోపేత సీ
మలలో హింసచిగిర్చి పూచి ఫలియింపన్ జొచ్చె నీ చేతలన్.

నెత్తురుపిండిపీల్పుటయె నీతిగ భావనజేయువారిలో
మత్తువదల్చినట్టి జనమాన్యుడు; శాక్యమునీంద్రు; డాయనన్
జిత్తమునందు నిల్పినప్రసిద్ధుడవందురు దారిదోపిడీ కత్తులకోతలే విధముగన్ రుచియించె మలీమసాత్ముడా !

చెలిమిమై యుపకృతి సలుపనుంకించిన
పథకమ్ములన్ భగ్నపరచినావు ;
ఆర్షధర్మమె జీవితాదర్శమనుకొను
వారిపై పగబూని వచ్చినావు;
తాతలనాటి విధానమ్ము నమ్మక
పొలిమేరచెలుపగా బూనినావు;
[illegible]
[illegible]

జగతిగల మానవాళికిసహజములగు
నీతినియమాలు విడనాడి నిలిచినావు;
రాక్షసత్వముచే చరిత్రను కళంక
పంకమునదేల్చి అపకీర్తిబడసినావు.

జగములు మెచ్చజాలిన యశమ్ముగ[illegible]చుటకూహసల్పగా
వగకొన టొక్కటే తగినబాటగ దోచెనె? అందు మైత్రికిన్
సిగపయి పూవుగా వెలయు సీమపయింబడెనే! దురాశతో
రగిలెడిచూపు నిక్కమగు రక్కసికోరిక మింటికెక్కెనే!

మదిరనకోర్కెలన్ మునిగిపోయిన మోటుతనమ్ము కైపులో
కదలెడి గర్వరేఖల వికారమునంబడి యెల్లవారినిన్
జదునొనరింపనేర్తునని సాగెడి నీ జతనమ్ము హేళనా
స్పదమగురా! నిజమ్ముగ పిశాచదురాశ జయింపలేదురా!

అలము సేయుటొప్పని మహాత్ముడియూన [illegible]
పాలనజేయు మా భరతభాగ్యవిధాతలి ధర్మదృష్టినే
తూలి వచింపనీక్షెటిన [illegible]
జాలము శాంతిపై రణము నల్పగజంగిన [illegible]



మురళి

మా రాజ్యమ్మున ప్రేమమైనొనగు సన్మానమ్ములన్ బొంది భ
వ్యారామమ్ములు పుణ్యతీర్థములు; దివ్యక్షేత్రముల్గాంచి; ము
క్కారుంబండు పొలమ్ము సస్యరమకున్ గాణాచియైయుంట గ
న్నారంజూడగలేక-దుర్భ్రమలమగ్నమ్మౌట మర్యాదయా?

భాయీ!భాయి! యటన్న నీనుడుల సంభావించియుప్పొంగుచున్
తీయందీయని యోచనల్ పెరుగలేదే! మా ప్రజాకోటిలో-
మాయావీ! పయినున్న తేనె విషకుంభక్రూరతన్ గప్పిన
ట్లాయెన్-తావకచర్యలన్ గల రహస్యార్థమ్ములూహించినన్.

తిలకింపన్ గలమే చరిత్రల ధరిత్రిన్ మైత్రితోవచ్చి-ని
చ్చలకత్తుల్ మెఱయించు ద్రోహుల-మహోత్సాహమ్ముతో సల్పువిం
దులలో హా సిపురాన నెట్టియగు ఘాతుల్నిన్నుమించెత్తెనో!
తలపంబూనక భారతమ్మున రణద్వారమ్ము నిర్మింతువా!

అమరెడి భోగభాగ్యముల యౌచితినెంచక పొంగి-కోర్కెగు
ఱ్ఱమువలె స్వార్థకల్పనగ: పరాకుగ పగ్గము పట్టలేక-ఘో
రములకు సాహసించుటకు [illegible] స్వతంత్రతా-మానవాళికో
[illegible] ఫలింపగావలెన్.

# శ్రీ "ఆదిభట్ల"

హరికథారంగమునకు నూతన శోభలు దిద్దిన మహోన్నత ప్రజ్ఞానిధి శ్రీ ఆదిభట్ల నారాయణదాసుగారు. బహుభాషాకోవిదులై - హరికథా పితామహులై - యక్షగానకళకు ఖండాంతర కీర్తి నార్జించి పెట్టిన యాపుణ్యమూర్తి సర్వులకు సర్వదా సంస్మరణీయులు.

శుంభన్మోహనయక్షగానవిభవాస్తోకప్రభావమ్ము సం
రంభమ్మొచు రసజ్ఞలోకముల కాహ్లాదమ్ము నందింపగా
"శంభో!" యన్నభవన్నుతిప్రతతి విశ్వమ్మందు మార్మ్రోగులే
అంభోధిప్రతిమానగర్జనలతో - ఆనాటికీనాటికిన్.

చిరుగజ్జెల్మురళీరవాల రుచికిన్ జిహ్వామ్ములై మంజుల
స్వరసంతానమరీచిమాలికలతో నయ్యాటలాడంగ [illegible]
ఖరకున్ జీవమువోయు శ్రమగళముప్పొంగగా వియద్గంగమై
నరినీకెవ్వరటంచుపోల్చగలమజ్ఞా [illegible]



## మురళి

చిటికెల్ కేల మనోజ్ఞనాదసుమవృష్టిన్ సృష్టిసల్పంగ ది
క్తటులన్ దిగ్భ్రమలోన ముంచినది నీగాంధర్వమే – భవ్యసం
ఘటనమ్మాంధ్రచరిత్రలో భవదమోఘప్రజ్ఞ – యుష్మత్కళా
చటులస్వాదుయశమ్ము భారతికిశశ్వద్భూషపద్యన్మణీః

మాయనికీర్తి గాంచితివి మానవమానసపీఠిమీద – నం
స్థాయముగా రహించు జలధుల్ రవిచంద్రులు వెలుదాకనీ
తీయనిగానగాథ – ఘనదేశికగౌరవభావభాసః నా
రాయణదాసః పూర్ణదరహాసవిశేషవిలాసః తే నమోః

నటనము, గానముల్, కవిత; నైపుణి; ప్రేక్షకలోకభావనా
పటిమపయిన్ ఘటించెనటబంధురభక్తిమయ ప్రవృత్తి – ము
చ్చటపడి – నీకథాకథనచాతురిగాంచిన ధన్యజీవులి
ప్పటికిని పారవశ్యమున వాకొనుచుండెదరీయథార్థమున్.

నీ శిష్యుల్ గణనీయులై నటుధురై – నీ దివ్యసంగీతవి
ద్యాలోలుల్; రమణీయవాఙ్మయసుధాధారా విశేషమ్ముల
నీ శాస్త్రప్రతిభాసమగ్రతయు సన్మోదించెంగా నేడు – నీ
మాటలోరదలావ వెల్గుదురు పద్యాంధ్రమ్మునందుద్ధతిః

తెలుగుంబోకడ లొక్కప్రజ్ఞ మహతన్దీపింప; గీర్వాణసూ
క్తుల లీలామహిమమ్ము లింకొకయెడన్ గూర్మిన్ రగుల్కొల్పమం
జుల శయ్యా సుకుమారసంపదలతో శోభించుకావ్యాంబుజ
మ్ముల - వాణీచరణమ్ములన్గొలుచు మీపుణ్యమ్ము నగ్గించెదన్.

యక్షగానమునకే దక్షతన్గూర్చె నీ
            మోహనప్రవచనామూల్యశక్తి -
సంగీతవిధులకే సఫలతన్దెచ్చె నీ
            మధురగళస్రవన్మహితరీతి -
భరతభంగిమలకే పరువునునిల్పె నీ
            నవనవోద్ధతనటనాప్రశస్తి -
కావ్యవాహినులకే ఘనతము బెంచె నీ
            సత్యసంబద్ధసాహిత్యసృష్టి
తెలుగు సొగసునకే క్రొత్త వెలుగునిచ్చె
తావక మనోజ్ఞరూపతత్త్వ ప్రదీప్తి -
భారతీయతకే నవప్రతిభదిద్దె
యుష్మదద్భుతసేవామహోజ్జ్వలదశ.



మురళి

సిరియును జ్ఞానబలమ్మును
తరుణకళాసంపదయును – ధార్మికగుణత
త్పరతయు – కవితాచణతయు
హరికథకుల నీకె యబ్బె నధికాధికమై.

కళలనిలయమ్ము విజయనగరము నుండి
వచ్చినాడ కళాసరస్వతిని నేను
తెలియుడని చెప్పగలిగిన ధీబలమ్ము
నిక్కువము తెల్గుగడ్డపై నీకెచెల్లు.

తెలుగుపదాల నిక్కమగుదీప్తి నెరింగి తదంతరార్థముల్
వెలుగులుచిమ్మ రామకథ విజ్ఞులు మెచ్చ రచించునేర్పు నీ
కలమునకబ్బె – నీవొకయుగమ్మునకేలికవై కవిత్వశ
క్తుల వెలయించినావు పలుకుంజెలిభాగ్యముపండిపొల్లగన్.

పలుబిరుదులలో నీకున్
గల "ప్రజ్ఞ కుమార్ భయాము" కాదా సాత్త్వ
త్త్వాంశయుత మోజ్జ్వలవిద్యా
దానసంయుత! శారదాకృపాసమపేతా!

మాట నిలుపుకొనగ మానవధనాగ్రణీ!
ఒక్కరాత్రిలో రసోజ్జ్వలముగ
అంబరీషచరిత హరికథగా రచి
యించినాడవంట – యెంతవింత!

సకలవైదికవిషయచర్చలఫలమ్ము
సరససారస్వతవిలాససంయుతమ్ము
ప్రథితవిజ్ఞానవైభవభాసురమ్ము
నీ "జగజ్జ్యోతి" యెన్నగ నిస్తులమ్ము.

ఆమహనీయభావమధురాపగలో రసలుబ్ధులెల్లరున్
శేముషిగొల్లగొట్టుకొని – చిత్తవికాసమునంది – సర్వదా
కోమలభవ్యవైదిక నిగూఢ నిరూఢ విశేషవైదుషీ
సీమలలో జరించెడి ప్రసిద్ధినిగాంచి తరింతు రెంతయున్.

వేదమ్ము లుపనిషత్తులు
వేదాంగమ్ములు పురాణవిపులార్థమ్ముల్
స్వాదుమనోహరకవితా
వాదమ్ములు నీకు వంకపాళమ్ములహో

## మురళి

ధ్రువచరిత్రవ్రాసి – స్తవములుపాడిన;
పరమభాగవతుడ! పావనుండ !
నిరుపమానమైన నిశ్చలదీక్ష నీ
జీవితమున సిరుల జిందిపోసె.

నృపతు లఖండసత్కృతుల నిండదనియింపగ నాంధ్రభారతీ
కృపవరలన్ సుధంజిలికి కీర్తికిమూర్తిగనిల్చు "జానకీ
శపథము"వ్రాయనేర్చితివి – స్వాదుమనోహరకావ్యధర్మముల్
సుపరిచితమ్ములై మసలుచున్–కవిపండితకోటినూపగన్.

అరయగ రుక్మిణీపరిణయమ్ముపయిన్ గణనీయమైన యా
దరణను జూపుచున్ ప్రణయధర్మముల న్వివరించువేళ నీ
సురుచిరభావమాలికలశోభ – మహాంధ్రసరస్వతీనవా
భరణముగారహించె కవిపండితసత్తములూగిపోవగన్.

వలసినన్ని గౌరవమ్ములు వలచి నీ
వరపజేరె – కృతులసంఖ్యమీరె–
నిన్ను కోరివచ్చి నిపుణులై శిష్యులు
[illegible] నీకు సత్యముగను.

---

# జే జే లు

పరులకు తలవంచెడి దు
ర్భరదశ దొలగింప – జాతిభద్రతకొఱకై
సిరులనొలికింప – మహితా
ధ్వరమునుసాగించినట్టిధన్యుడ! జోతల్.

ఆశకులోబడకయె – ఆ
వేశమ్ముల జూపకయె – పవిత్రతపమ్ముల్
పేశల సంకల్పమ్ములు –
నీ శక్తిన్గెలిచెనయ్య! నిర్మలహృదయా!

నీయడుగులలో నడుగిడి
యీయవని చరింపనేర్చునేని – అనంత
శ్రేయము జాతికిగలిగి – అ
మేయసుఖంబిమరు విశ్వమే వెలుగందన్.

## మురళి

జాతికి జనకుడవను వి
ఖ్యాతి సమార్జింపనేర్వగలిగితి వహహా
నీతికి నీ సుచరిత్ర
జ్యోతి_నవప్రభల_నూత్నశోభలదిద్దెన్.

"బాపూ" నామము స్వేచ్ఛా
రూపమ్మని యెంచిరెల్లరున్ _ సౌభాగ్య
శ్రీ పూర్ణమాయె భారత
మోపుణ్యఖనీ ! భవన్మహోజ్జ్వలదీక్షన్.

చిత్తమ్ముల కలుషము వి
చ్ఛిత్తయి_మానవతలో విశిష్టత మెఱయన్
కత్తుల మొనలన్ సుమముల
గుత్తుల విరియించినావు గుణగణధనుడా !

తేనియలూరెడి పలుకుల
తో, నిఖిలజనమ్ములకు, సుదూరసుదృష్టిన్_
ధీనిపుణత, ఘటియించిన
నీ నిరుపమపథము _ వందనీయము _ తండ్రీ !

---

# వీర పూజ

[శాబర్ జెట్ విమానాన్ని పిట్టను పేల్చినట్లు పేల్చి-పాక్ సైనికులకు సింహస్వప్నముగా వ్యవహరించిన నిరుపమానసాహసి - ఆంధ్రవీరకిశోరము శ్రీ టి. పోతరాజు-

ఆయన - రణసీమనుండి; జన్మభూమిక పిచ్చేసిన తరుణంలో -తెలుగు నేల పులకించి బ్రహ్మారథం పట్టింది, కర్పూరహారతులెత్తింది.]

కన్నులునెత్తికెక్కిన ప్రగల్భులగుండెలు చెండివేయగా
నెన్నడు నాకువీలులభియించు నటంచుదపించినాడవా !
అన్న ! మహాంధ్రలోకహృదయమ్ముల నూపిన పోతరాజ ! నీ
పున్నెము పండె నిక్కముగ-పొందుము వీరరసాభిషేకమున్.

నిప్పులుగ్రక్కనా ! కనుల నింగిపయిన్ జరియించు శత్రువున్
పిప్పియొనర్పగా ప్రళయభీకరరూపముదాల్చువేళ-యే
ముప్పును లెక్కసేయకయె ముందుకుదూకిన తెల్గుబిడ్డ ! నీ
గుప్పిటిలో; "తుపాకి" బలిగొన్నది శాబరుజెట్టుపిట్టలన్.

వయసునబిన్నవయ్యు ! నరివర్గముపాలిటి రుద్రమూర్తివై !
జయములభింపగా సమరసాహసమున్ బ్రకటించినావు ని
ర్భయముగనిల్చి – ఆంధ్రులపరాక్రమలీలకు మచ్చుతున్కలై
మెయి బులకింపజేసినవి మిత్రమ ! తావకకీర్తిసంపదల్.

భారతజాతిసర్వము సెబాసనిమెచ్చగ తెల్గుగడ్డ నీ
పేరునవన్నెకెక్కెనది – భీషణసంకులయుద్ధభూమిలో
భారతమాత మెప్పుగనుభాగ్యముతో జయలక్ష్మిదక్కె నీ
పౌరుషవహ్ని విశ్వహితభావనకంకితమాయె మాన్యుడా !

నినుగనిపొంగిపోయినది నిక్కముగా నొక యాంధ్రభూమియే
యనుకొనుటేలనయ్య ! భరతావనిసర్వము నీప్రచండపో
రణవిభవమ్ముగాంచి యనురాగముపూనెను – విశ్వసంస్తుతుల్
గొనుమిక – పాక్కిరాతకుల గుండెలుతల్లడమంద వీరుడా !

సురుచిర విక్రమమ్మున యశోవిభవమ్ము గడించి యాంధ్రులం
దరి ఘనగౌరవమ్ము – వసుధన్ కలకాలము నిచ్చునట్లుగా
వరలుచు; వీరపూజగొనవచ్చిన సాహసమూర్తి ! పూలపం
దిరివలె తావకీనమగు దివ్యభవమ్ము కృతార్థతన్ గనెన్.

# జయము! భరతవీర!

పచ్చికసాయిపైఖరికి పొల్పడి-చల్లనిశాంతిసీమలో
చిచ్చురగుల్పగా కరకుచిత్తము సమ్మతిజూపె-మైత్రికిన్
కచ్చెను తుల్యగౌరవముగన్ ప్రకటించి కృతఘ్నులైనవా
రిచ్చు జవాబులిట్టివి-గ్రహించె ప్రపంచపుసభ్యదేశముల్.

అలుకమెరుంగనట్టి కరుణాళువు పండితనెహ్రూజీ మహో
జ్జ్వలుఁడయినిల్చినాడు రథసారథిగా-నడుముల్ బిగించెరా
కలతలుమాని కోట్లబలగమ్ము-నిజమ్ము-పరాక్రమించి; యీ
అలతులు సల్పుచుండిన దురాక్రమణమ్మునెదిర్చి పోరరా!

నీ వెనుకన్ ప్రబుద్ధధరణీతలమంతయులేచినిల్చె ను
గ్రావహాభారమూన విజయామృతమాధురులాన భారతో
ర్వీవర వీరశేఖర! మలీమసచిత్తుల మత్తనేత్రయు
గ్మావృతకావరమ్ము భవదద్భుతలీలకువిచ్చిపోవలెన్.

మనదేశమ్మనుమాటయొక్కటెమవిన్   మన్నించి; చైనీయదు
ర్జనపైశాచికమారణక్రియలలో సర్వస్వమున్ దీక్షతో
రణరంగమ్మునవొడ్డి మాతృయశమున్ రక్షింపగాబూను నీ
ఘనతల్ నిల్చు సువర్ణవర్ణముల నిక్కమ్మౌచునిత్యమ్ముగన్.

బుద్ధదేవునిభూమి—సంబుద్ధభార
తమ్ము—నడయాడుగాంధీపథమ్మునందు
సహనభావాన ముందుకుసాగిపోయి
జయముగనుమన్న!  నీ కపజయముసున్న!

—

# పౌష్య పద్మజ

సిరులఁజిలికించు–మోహనమురళియగుచు
మధురనాదాలు వినిపించు–మనసునూపు
సంబరమ్ములు విరియించు–జగతికసమ
శాంతిఘటియించు, నూత్నసంక్రాంతి లక్ష్మి.

పరిహాసమ్ముల తోరణమ్ములపయిన్ బ్రచ్ఛన్నభావాల సుం
దరగూఢార్థములెన్నొ వన్నెలనుజిందన్–భవ్యసమ్మోదసా
దరతత్త్వములు మేలియూహాలకు నెత్తావిన్ బ్రసాదింప; న
బ్బురమున్ గూర్చును; పౌష్యపద్మజ–కళాపూర్ణమ్ముగా నేడహో!

అనురాగప్రభలానసమ్మున నవాహ్లాదమ్ము సాధింప గొ
ల్చెను భూమాలను కర్షక ప్రభువు–మేలే–ఆఋగాలాలతీ
అని: విశ్రాంతినెఱుంగబోని పనికిన్ లాభమ్ము జేకూర్చె నీ
ఘన సంక్రాంతి పురుల్ సిరుల్ గులుక–వేడ్కల్ గంగలై పొంగగన్.

మురళి

చలిగిలిలెక్క సేయక – హుషారుగనిద్దురలేచి – బాలికల్
తెలతెలవారకుండగనె దిద్దుదు రందము చందమూరగా
సులలితరంగవల్లుల విశుద్ధవిధమ్ముల; ముంగిటన్ రసో
జ్వలములు గొబ్బిగీతము లవారిగ బాడుచునాడుచుం దమిన్.

పుట్టింటికేగంగ "బులపాట" వడుసతి
నులికించి వలపింప దలచుమగడు
రానున్నయల్లుని కేనూత్నవస్త్రమ్ము
లిష్టమ్ములగునని యెంచు మామ
అనుగు గూతురికి నచ్చినపిండివంటల
నాలోచనము సల్పునట్టితల్లి
బావలపొగరు సర్వముడింప కొంటెగా
భావించి మురిసెడి బావమఱది

పారవశ్యమ్ముగుండెల భద్రదీప్తి
వెల్లివిరియించుచుండగ వేవిధాల
కలలుగందురు స్వర్ణసంక్రమణభవ్య
పర్వవేళల నానందమూర్మి బౌరల.

ఇది సరదాలపండుగ నవేందిరసై మనయాడుబిడ్డ లి
య్యదసున గీమునిండ దరహాసశుభంకర సుస్వరాళితో
ముదములు చిమ్మిపోయుదురు ముచ్చటలాడుచు తెలుగ్గేస్తు తే
కొదువయులేనిలీలల నకుంఠితసౌప్రముదాబ్ధిదేలుచున్.

మధురపయఃస్మనోజ్ఞ మహిమమ్మునుజూపుచు-ఆటగత్తెయై
వదనముద్రిప్పుచున్ మృదులపై ఖరితో నటనమ్ముసల్పుచున్
సదమలరాగలీల సెకసక్కెములాడుచు కన్నెమిన్నయై
యొదనలరించు బంతి చపులీనుచుసంక్రమణమ్ము వేళలన్.

కలకలలాడెడి వదన
మ్ములపయి దరహాసరుచులు మునరుకొనంగన్
కులుకులకుప్పలుగా- క
న్నెలు కిన్నెరలగుచు నేడు నిలుతురుభువిపై.

---

# కర్షకస్వామి

నాగలిబూని రాబ్యమును నందనభూమిగ మార్చునట్టి నీ
యోగము సర్వమానవ మహోదయమై యలరారు; భావికిన్
బాగుఘటించి యీ భువనభాండము లన్నిటి సాకజాలు నీ
నాగలిగొప్పమిన్న – నరనాథుల గొప్పలకన్న కర్షకా!

పండినచేలలో నిలిచి భారతమాతకు ముద్దుబిడ్డవై
నిండు ముదమ్ముగూర్పగలనేర్పరి! నీ బసవన్న సేవలో
గుండెలుపొంగునీకు – కనుగొల్కుల మోదకణాలురాలు – నీ
దండిమనోబలమ్మొకటె; తారకమౌను నిజమ్ము జాతికిన్.

అలసట యెట్టిదో యెఱుగనట్టి మహాత్ముడ వీవు – నీదయా
బలమె బలమ్ముజాతికి – అపారము నీ శ్రమ – భూమిబ్రద్దలై
జలజలరాల్చు రత్నముల – స్వార్థమెఱుంగని నీ కృషిప్రభా
విలసదపూర్వవై ఖరికి విస్మయమంది సమాదరించుచున్.

దేశసౌభాగ్యమ్ము తేజమ్ము జిమ్మగా
ఘనమూల మీ ముల్లు గఱ్ఱగాదె!
కలిమిని పెంచి లేములనుద్రుంచి హితమ్ము
గలిగించు టీ ముల్లుగఱ్ఱగాదె!
పసిడిని పండింప – ప్రజలను మురియింప
కారణమ్మీ ముల్లుగఱ్ఱగాదె!
ఊసరక్షేత్రాల కూపిరిబోసి – చ
క్కగ దిద్దుటీ ముల్లుగఱ్ఱగాదె!
భువిని స్వర్గమ్ముగామార్చి పుష్కలమ్ము
గా – శుభములిచ్చుటీ ముల్లుగఱ్ఱగాదె!
సకలమానవ సౌఖ్యములకును "ముల్లు
గఱ్ఱ" యోచింపగా "జీవగఱ్ఱ" గాదె!

మేదినిబట్టి యీ తలకుమించిన భారముమోయనంచు నీ
వాడిన – విశ్వశోభకొఱవై కఱవేర్పడు – లోకబంధువే
కాడినివీడునాడు త్రిజగమ్ముల నోటికి ముద్ద దక్కునా
నాడును–నేడు–రేపు–యుగనాధుడవీవె నిజమ్ము కర్షకా!

# ఉగాది

కలలు ఫలించులీల–కలకాలము తేనెలసోనలూరు మం
జులకమనీయ కావ్యకళసోయగముల్ జిలికించునట్లు–సం
కుల సమరాలు శాంతిరమకున్ దలవంచి చరించురీతి–క్రొ
వ్వలపులతేఱుపై తెలుగువాకిట నిల్వుము ! నూతనాబ్దమా !

అరువదియేండ్లనాడు దరహాసమరీచికలీయిలాతల
స్ఫురదసమానకాంతులకు–సుందరరూపముదిద్ద నీ వెటుల్
వరలితివో ! వచింపగలవారొక రిద్దరెయుందు రిప్పుడా
చరితలసాక్ష్యమేటికి ? ప్రశంసలనందు ప్రధాన సొగసుమా !

చిలకనిక్షీరముల్ రుచులజిందువిధాన–వసంతకోకిలల్
గళములువిప్పి పాడుగతి–కన్నెగులాబి రసజ్ఞమానస
మ్ములనలరించుభంగి–ముదమున్ ఘటియింపగబూనితేనెసో
నలయరదమ్మునెక్కి పయనమ్మొనరింపుము ! నూతనాబ్దమా !

నరుని నరుండుదోచుకొన నాట్యము సాగుచు నుండె విశ్వమం
దినమున నేడు–సర్వజగతీవలయమ్మున శత్రుభీతియే
పెరుగుచునుండె యాంత్రికపు వృద్ధియు మారణకారణమ్ముగా
వరలగసాగె–గుండియల వత్సలతల్ మరి పండుటెన్నడో!

కలిమి కు స్త్రీల సర్కసులందు–మానవ
త్వమ్మాటవస్తువై–తనరుచుండె;
ఫ్యాషన్ల బరువుల బండారముల క్రింద
సంస్కృతి సత్తువ–జారిపోయె;
మోసాల గరిడీల మోజులో–న్యాయదే
వత యౌదల– మరింత వంచబడియె;
స్వపరమ్ములనెడి–వాత్సల్య విద్వేషపం
క్తులమధ్య–ప్రేమయే క్రుంగి కూలె;
ఏ ప్లవంగయు నే లీల నిట్టి విషమ
వికృత వైఖరి సరిదిద్దు? సుకృతి వీవె
దక్షతన్ జూపవలె భువిన్ దనియజేయు
కీలకమ్ము నెరింగిన కీలకమ్ము!

మురళి

మనుజులగుండెలందు కుసుమమ్ముల మెత్తదనమ్ము—చందమా
మను మరపించు శీతలము—మందిరసాల రసాల మాదురుల్
కనదురుశోభలీను కనకప్రభ— పీఠముపెట్టుకొన్నచో
మనుగడ మాన్యమౌననుచు—మాకు హితమ్ము వచింపుమమ్మరో!

మలపూతబడవలె—మనుజుని హృది
క్రొత్త బెల్లమ్మున గూడు గట్టుటెకాదు
తీపి గుండెలగూడ—తెరలపవెను
వేపచేదునెకాదు — ద్వేషదృష్టినిగూడ
సహియింపవెరె; సాహసమున సరుదు
కందాయ ఫలముల గణనెమ్మననెకాదు
నయశీలముల మతి; నెడపవలెను
హితసుతులపైననేకాక — యెల్లవారి
పట్ల నభిమానసంపద బరపవలెను
స్వీయగేహమ్మునే కాక — విశ్వగేహ
సీమనానంద జలధిగజేయవలెను.

# బొజ్జవేల్పు

మూషికవాహనమ్మునయి ముజ్జగమేలెడిమేటి; భూషలే
భాషలుగా రహించుసురపండితవర్యుడు: బాలభక్త సం
తోషకరుండు; నేడు దయతో మనయింటికి వచ్చి క్షేమ సం
భాషణసల్పు - పూజలిడ పత్రి కరమ్మునఁగొమ్ము తమ్ముడా!

కరుణన్ పొరలింపన్‌గల
దరహాసము విరియు వదనదర్పణమున మేల్
సిరులన్ గురియించెడి మన
గిరిజాతనయునకు భక్తిఁ గేల్మోడ్పుమురా!

హరణములు విఘ్నముల; కా
భరణమ్ములు మనుజహస్తపంక్తికి; శుభసం
స్ఫురణమ్ము లట్టి గణపతి
చరణమ్ములు జగతి కెపుడు శరణమ్ములగున్.

విమల కుసుమాల వెంకటరమణ! తెమ్ము
సత్యమూర్తి! యొసంగరా! స్వాగతమ్ము
పద్మ! అందీయవే తల్లి! పాద్యపాత్ర
మురళి! నటుహొసరింపరా! శిరమువంచి.

శుభముల నిరుపమలీలన్
ప్రభవింపగజేయు ప్రబల పాండిత్యముతో
విభవమ్ముల నలరించెడి
ఇభవదన! నమస్సుమమ్ము లిడెదము తండ్రీ!

చిలికింపన్‌గల వంటగా పసుపుగోచీర్పెట్టి నీ పావపం
క్తుల చెంతన్ గుమిగూడి సంబరమునన్ గుంజిళ్ళతో మ్రొక్కు కు
ఱ్ఱలపై దీవెన లీ దిన మ్మెలుకగుబ్బమ్మెక్కి యింటింట పూ
జల నందం జనుదెంచునప్పు డతులోత్సాహమ్ము సంధించుచున్.

బొజ్జవేల్పున కేపాటి పూజసలిపి
మెచ్చుకొనజేయగలరిట? యిచ్చకొలది
కులికి గుంజిళ్ళతో బాలకులు నమస్సు
లర్పణ మొనర్ప వెనకయ్య! అలరునయ్య!

---

# గురుదేవ

సిరు తెగడమ్మునన్ – సమరసీమల నేలెడి పౌరుషప్రభా
కరులకు దల్లియైన – కవిపండిత శిల్పకళావతంసులన్
మురియుచు పెంచినన్; భువనపూజ్యులఁగాంచి యశమ్మునించునా!
భరతధరాపవిత్రి నినువంటి మహాత్ముల పెంచకుండినన్?

దైవికభావనాపరత దగ్గి – అధార్మికతత్త్వపేరికిన్
సేవలు నల్పుబూనుజనజీవనమై ఖరిమార్ప – నైతిక
శ్రీ విలసిల్లు యోగబలసింధువుగా బ్రవహించినాడవ
య్యా! వసుధాతలమ్ము చరితార్థతనందె భవద్భవమ్ముతో.

లోకమాతయనుగ్రహాలోకనమున
నిగమములు చెప్పబడిన వన్నెలవరాల
మానవత నిల నింపగా బూనినావు
దక్షిణేశ్వరిపహాని! వందనశతమ్ము.

ఇశా

కలిగించె నీ పుట్టుకయె మాన్యతను – విశ్వ
మున; భారతమున కపూర్వలీల –
వెలయించె నీ సాధువృత్తి సమస్తతా
పస జీవనమున నవప్రశస్తి –
సృజియించె నీ భావసీమ పావన వివే
కానందరూపకోద్యానవనము –
ప్రసరించె నీ భవ్యవాణీబలమ్ము ది
గంతాలవరకు వేదాంతకాంతి –

వెల్లివిరియించె నీ ప్రేమవీక్షణమ్ము
కలుషపరిపూర్ణసామాజికవ్యవస్థ
పై; పరంజ్యోతి వెల్గుల ప్రాభవమ్ము –
రామకృష్ణాఖ్యయతిరాజ! రమ్యతేజ!

ధనధాన్యమ్ముల కాసజెందక యథార్థమ్మైన యానందసా
ధనమున్ జేయగ – విశ్వమంగళమె సర్వస్వమ్ముగా నెంచి యో
గనిరూఢిన్ బరతత్త్వవైభవశుభాకారప్రశస్తిన్ జగ
జ్జనని న్గొల్చిన పుణ్యమూర్తి వి – ప్రశంసల్ నీకు వేవేలికిన్.

---

# మాతృశ్రీ

శ్రీపదమ్ములు – సకలమతా
హ్లాదమ్ములు – జనగణముల యభిరుచికిం బ్ర
సాదమ్ములు – తల్లి ! నీ
పాదమ్ములు – జగములకు శుభమ్ములు గూర్చున్.

సాతమును ఘటియించెడి స
ద్వ్రతము – దయారతము – ధర్మభావవిభవసం
యుతము – జగన్నుతమా నీ
మతము – సుఖంకరము మనుజమండలి కెప్పుడున్.

నయన యుగమ్మున సతతము
దయ యొక వెలయేరువోలె తాండవమాడన్
సుయశమ్ముగన్న నీ గా
థయె మోదముగూర్చి నరుల దనుపును తల్లీ !

పదులన్ ప్రేమగ జూచుట
గరువతనమ్మునకు లొంగి కార్పణ్యాదుల్
పెరగని పగిది జరించుట
వరములుగా నొసగుమమ్మ ! వాత్సల్యనిధీ !

మోసాలకు రోసాలకు
దోసాలకు దూరముగనె తొలగుచు సర్వో
పాసన జేయంగల వి
శ్వాసమ్మును మాకు నిమ్ము జననీ ! కరుణన్.

పావనమగు జననీ ! నీ
దీవన – అనురాగపూర్ణర్థమ్మై లో
కావన దీక్షమయ సం
భావనలకు నిలయమగుచు భద్రప్రదమై.

అరుణమ్ములు – కలుషౌఘా
హరణమ్ములు – జనగణముల యొదలలకు నా
భరణమ్ములయిన యుష్మ
చ్చరణమ్ములు జగతి కెపుడు శరణమ్ములగున్.

–( ౦ )–